సంపుటము 5] ఏప్రిల్, 1919 [సంచిక 10

# బాలమిత్ర

## పంచదార పాట

పల్లవి

పంచదారకంటెను - మించినదున్నాదా
మంచి పిండివంటలన్ని - పంచదారతోటిదా ॥ పంచ ॥

1. అటుకలోని చిటుక - బెల్లమెకటుం కటుంమని
చిటుకు పటుకు, లటుకు, ఫటుకు - కోరికెచూడు కోమలీ ॥ పంచ ॥

2. పనస పంచదారదినుసు - దినుసుపిండివంటలు
మనసులూర తినెడివారి - మహారాజులందురూ ॥ పంచ ॥

## చెఱకు

చెఱకుతోటలు విస్తారముగా ఉష్ణప్రదేశములలో పెరుగును. చెఱకుచెట్టు పొడుగుగా గడవలె పెరుగును. మధ్యమధ్య కణుపులదగ్గర సన్నని ఆకులుండును. గడ బాగుగా పెరిగినతర్వాత చివర వెన్ను వేయును.



చెఱకుతోటకు నీరు విస్తారముగా కావలయును. చెఱకు గడయందు తీయని రసముండును, అది వెన్ను వేసినతర్వాత రసము చప్పబడిపోవును. కాబట్టి వెన్ను వేయక పూర్వమే గడలను నరికి రసములేని ఆకులను చివరనుండు దవ్వలను తీసి వేసివేయుదురు. తరువాత గానుగలో పెట్టి నలిపి రసము తీయుదురు.

ప్రక్క పటములో చెరకుగానుగ చూపబడినది. దగ్గరగా నున్న రెండు ఉసుపరోకళ్లు గుండ్రముగా తిరుగుచుండును. వానిమధ్యను గడను కలిపించిన అది నలిగిపోయి దానిలోని రసము కారిపోవును. ఆ రసమును కుండలలోబట్టి పెద్ద

గంగాళములలో బోసి వాని క్రింద మంటబెట్టి కాచుదురు. అప్పుడు దానిలోని నీరు ఇగిరిపోయి రసము పాకమువలె చిక్కబడును. చిక్కనిపాకమును ఆరనిచ్చిన అచ్చులవలె గట్టిపడును. అవే బెల్లపుఅచ్చులు.

బెల్లపుపాకమును కుండలలో బోసి నెమ్మదిగా ఆరబెట్టిన యెడల అది గడ్డకట్టి తీర్చినముక్కలుగా నేర్పడును. అవే కలకండ లేక పటికబెల్లపుముక్కలు. ఆ ముక్కలన్నియు ఒకేతీరున యుండును. వాటికి స్ఫటికములు అని పేరు. ఉప్పుకణములుకూడ స్ఫటికములే.

---

# ఒక చిన్న నీతికథ

ఒకానొకప్పు డొక పట్టణము గలదు. అందు ఒక రాణిగారు గలరు. ఆమెగారు చాల ధనముగలదై బంగారముతో తులతూగుచుండి ఒక మంచి ఆలోచనయైనను లేక నిశ్చింతగా నుండెను. మరియు ఎటువంటివారినైనను లెక్కచేయక బీదలను తృణీకరించుచుండెను. ఆ మహారాణిగారి యొద్ద ఒక గుఱ్ఱపువాడు గలడు, వానిజీతము ఏడురూపాయలు కాని వాడు తనకొరకును భార్యకొరకును పిల్లలకొరకును మూడురూపాయలు వ్యయము చేయుచు మిగిలిన నాలుగురూపాయలను

బీదలకు ఇచ్చుచుండెను. అక్కడనే యొక బోధకుడుగలడు. ఆయన చాల పేదవాడు గనుక, బహుశ్రమతో జీవనము చేయుచున్నాడు. ఒకనాడు ఆ మహారాణిగారు నిద్రించుచుండగా, యిద్దరుదూతలువచ్చి ఆమెను పరలోకమునకు తీసికొనివెళ్లి మొదట పరిశుద్ధులయొద్ద కూర్చుండబెట్టి వారిని తాకవద్దని చెప్పగా ఆమె చింతపడెను. కొంతకాలము అయిన తర్వాత ఆమెను అక్కడనుండి ఒక చక్కని పువ్వులతోటలోనికి తీసికొనిపోయిరి. అయితే ఆమె ఆ పుష్పములను ముట్టుకొనగానే అవి ముడుచుకొనుచున్నవి. ఆమెకు మరి యెక్కువగా చింతగలిగెను. తరువాత ఆ దూతలిద్దరును ఆమెను ఒక చక్కని బంగళావద్దకు తీసికొనిపోయిరి. అప్పుడామె అదిచూచి యిది నాకొరకా? అని అడుగగా నీకొరకుగాదుగాని బీద బోధకునికి అని చెప్పి మరియొక చక్కనిదానివద్దకు తీసికొనిపోయిరి. ఆ రాణిగారు నురల అడుగగా ఇది నీయొక్క జీతగాడైన గుఱ్ఱపువానిదని చెప్పిరి.

ఆ మహారాణిగారు నాకు సిద్ధపరచిన మేడను చూపుమనగా ఒక చిన్న గుడిసెవద్దకు తీసికొనిపోయిరి. అప్పుడామె నేను చాల ధనవంతురాలను నాకు యిటువంటిది ఎందుకు కట్టితిరని అడుగగా వారు యిట్లు చెప్పిరి. భూలోకమునుండి మీరు ఎటువంటిసామాను పంపుదురో అటువంటిదానితోనే యిక్కడ మేడలు కట్టబడునని చెప్పగా ఆ రాణి నేనుపోయి సామాను

సంపాదననైను అందుకు దూతలు పరలోకసంబంధమైనసామా
న్నిరి. అప్పుడు ఆమె, కనుక నే నేమిచేయువలెననగా వారు
నీవువెళ్లి నీధనము బీదలకుయిమ్మని చెప్పెను. ఆ రాణి అట్లు
చేసి పరలోకములో చేరెను.

కనుక మనము మొదట ఆ రాణి యేలాగుచేసెనో ఆలాగు
చేయక ఆ బోధకుడును జీతగాడును చేసినట్లు చేయుచు
మన జీవితమును తుదముట్టించి మనకొరకు తన రక్తమిచ్చిన
యేసుయొద్దకు చేరుటకు యత్నించవలెను. మరియు మనము
చందా వేయునప్పుడుగాని, బీదలకు ధర్మముచేయునప్పుడుగాని
క్రీస్తుచెప్పినవాక్యము జ్ఞప్తికితెచ్చుకొనవలెను. అది యేద
నగా? "పుచ్చుకొనుటకంటె యిచ్చుట ధన్యత" సహోదరు
లారా! మనము ఈ చిన్నకథను మనస్సులోనుంచుకొని
మన జీవమును ప్రయాణమును పూర్తిచేసినయెడల యేసు
క్రీస్తు ఒకవేళ మనలను తనయొద్దకు పిల్చునేమో? కనుక
అట్లుచేయుటకు యత్నించెదము. ఇదియే నాయొక్క మనవి.

---

## బైబిలు కథ

పూర్వకాలమందు పౌలను ఆయన క్రైస్తవులను
బహు హింసపరచుచుండెను. అతడొక దినమున ప్రధాన
యాజకునియొద్దకు వెళ్లి యీ మార్గమందున్న పురుషులనైనను,

స్త్రీలనైనను దమస్కులోని సమాజమందిరమువారికి పత్రికలిమ్మని యడిగెను. ఈ పత్రికను గైకొని దమస్కునకు వెళ్లుచుండగా, దారిలో ఆకస్మికముగా అతనికొక వెలుగు కానవచ్చెను. అటనతడు నేలఁబడి నన్నెందుకు హింసించుచుంటివని పలుకబడిన యొకశబ్దము వినెను. అంతనతడు ప్రభువా నీవెవడవని యడుగగా, ఆయన నేను నీవు హింసించుచున్న క్రీస్తును, లేచి పట్టణములోనికి పొమ్ము. అక్కడ నీవేమి చేయవలయునో అది తెలుపబడునని చెప్పెను. అతడు నేలనుండి లేచి చూపులేనివాడై తనతోనున్న మనుష్యులచే నడుపబడి పట్టణములోనికి వెళ్లెను. అక్కడ దేవునియందు భక్తిగల అననియ అనబడువానిచే బాప్తిస్మమంది క్రీస్తుయొక్క నమ్మకమైన శిష్యుడై ఆయనకొరకు దన ప్రాణముఁ గూడనిచ్చెను.

ఈ కథవలన దేవునియొక్క శక్తి మనకు తెలియవచ్చుచున్నది.

ఆయన తనపని శత్రువులద్వారా జరిగించగలడు. పూర్వము పౌలు మొదలగువారికి దేవుడు దర్శనమిచ్చి వారి హృదయములు మార్చుకొమ్మని చెప్పినట్లున్నది. ఇప్పుడు తన వాక్యము ద్వారా చెప్పుచున్నాడు. ఎట్లన "కాలము సంపూర్ణమై యున్నది. దేవునిరాజ్యము సమీపించియున్నది. మారుమనస్సు పొంది సువార్తను నమ్ముడి" (మార్కు 1: 15). అని యేసు క్రీస్తు చెప్పుచున్నాడు గనుక సహోదరులారా! దీనిని జ్ఞాప

కము చేసికొని మన నడతను క్రమపరచుకొందాము. ఇది నా మనవి.

G. MATTHEW
*Ponur*

---

# చంపాపురం గూర్చిన యొక కథ

చల్లని సాయంసమయమం దొక యాంగ్లేయ బాలిక యాటలాడి యలసి తల్లి మోఁకాళ్లు పట్టుకొని గునియుచు "నా కొక కథ చెప్పు" మని యడిగెను.

ఆసక్తితో పైకెత్తుకొనియున్న బిడ్డ మొగమును చూచి తల్లి ప్రీతి పూర్వకముగా చిఱునవ్వు నవ్వి,

"ఆంగ్లేయ కథ చెప్పుదునా?" అని యడిగెను.

తా నుండిన విశాలమైన వరాండము హిందూదేశ సముభూషయం దున్నను, అతిదూరమం దున్నట్టియు, ఆ చిన్నది యెన్నఁడును చూడనట్టియు పురాణ గృహములం గూర్చి ప్రతి సాయంత్రమును వారు మానసిక ప్రయాణము సేయు నభిలషించుచుండిరి. ఐనను, రుచిభేదించుటం జేసి యుప్పుడా బిడ్డ తలనాడించి.

"ఆంగ్లేయ కథ వద్దు; దయచేసి హిందూదేశ సంబంధమైన కథ చెప్పు" మనెను.

తల్లి యొక క్షణ మూరకుండి మెల్లగా నిట్లు చెప్పఁదొడఁగెను.—

యాత్రార్థమై రాణి సమాధికిం బోవు చంపాపుర స్త్రీలీ కథను చెప్పుకొందురు. అనేక శతాబ్దములకు పూర్వమిప్పటివలెనే చంపాపుర మొక పర్వత పార్శ్వంబున మనోహరంబై తేజరిల్లుచుండె. ఐనను చంపాపురీ కుమారికల మనంబులు విచారగ్రస్తంబులుగా నుండె; వారి జీవితంబులు సకాయ కష్ట భరంబులై యుండె. పట్టణంబు వెలుపల నొక లోయలో ప్రవహించు రవి నదంబు నుండి జలంబు తెచ్చుకొనుటకై వారనుదినంబును దుస్సహంబగు నెండలో దీర్ఘ ప్రయాణములు సేయవలసియుండె. తుట్టతుదకు రాజు వారి యెడతెగని కష్టములం జూచి జాలిపడి పర్వతముగుండ నొక కాల్వను త్రవ్వి జలంబులను పట్టణములోనికి తెచ్చున ట్లుత్తర్వుచేసెను.

"కృతజ్ఞతా పూర్వకముగా స్త్రీ లందఱును రాజు నాశీర్వదించిరి; కాని, పాపము! 'పెరుగుట విఱుగుటకొఱకే' యని నట్లు వారి యాశలు వ్యర్థమాయెను—కాలువ త్రవ్వఁబడెను గాని దానిలోనికి నీరెక్కదయ్యెను.

"అంతట రాజొక బ్రాహ్మణునితో నాలోచింప నతఁడిట్లు వచించెను.—'నదాధిదేవత బలి గోరుచున్నది. నీరు ప్రవహింపవలసినచోట నొక గొయ్యి త్రవ్వించి యువరాజగు నీ కొడుకును సజీవబలిగా నర్పించి యందు పాఁతిపెట్టుము; ప్రకాశమానమైన నిర్మల జలంబులు ప్రవహింపఁగలవు.'

"ప్రజానురాగ పూర్వకమైన స్వవాక్య పరిపాలనాసక్తికిని, పుత్ర వాత్సల్యమునకును రాజునంతరంగమునం దమితమైన పోరాటము తటస్థించె; తుదకు స్వవాక్య పరిపాలనాసక్తి జయముగాంచె. అంత రాజు తల వంచుకొని యిట్లు ప్రత్యుత్తరమునిచ్చె.—'జీవప్రద మగు జలప్రవాహ మబలలగు తమ సమీపమునకు తేబడు నని నేను నా ప్రజల కొమార్తెలకు వాగ్దానము చేసియుంటిని; నేను దానికి విరుద్ధముగా ప్రవర్తింపఁజాలను.'

"దగ్గఱ నున్న రాణి వింతకాంతు లీనుచున్న తన కన్నుల నెత్తి భర్తృనేత్రములకుం దార్చి 'వాఁడు చావకుండును గాక!' యని నెమ్మదిగా చెప్పె.

"విచారగ్రస్తములయ్యు దృఢంబులగు నతని దృష్టులామె దృష్టులం దారసించె. 'నా మాట తప్పవలయునా? స్త్రీలు నిరాశ చేసికొని నిరంతరమును శ్రమపడవలయునా?"

“ రాణి చూపులు చలింపకుండె. ‘ మనకుమారుఁడు చావకుండును గాక! స్త్రీలుకూడ శ్రమపడకుందురుగాక! నా ప్రజల కోమార్తెలయందలి ప్రేమాతిశయమునుచే నా కుమారునికి బదులు రాణినైన నేను నాతల్పముపైఁ బోలె సంతోష పూర్వకముగాను సమాధానముతోను ఆ గోతిలోని పండుకొనెదను చూడుఁడు’ అని యామె మరల దృఢముగా చెప్పెను.

“ రాణి యెప్పుడును నెమ్మదిగల ముగ్ధగా నుండెడిది; కాని యిప్పు డాకస్మికముగా నామెయం దొక క్రొత్తశక్తి యావేశించినట్లు కనఁబడెను; ఆమె భర్త దైవవాక్యమునకుఁ బోలె నా శక్తికి లోఁబడెను. ఆమె చెప్పినట్లే సర్వమును జరుగఁబడెను. నిండు మనంబుతోను, సంతోష పూర్వకముగాను రాణి సమాధిలో పడెను; బలి సంపూర్ణము కాఁగానే యాశ్చర్యకరంబుగా నూతిలోనికి నీరు ప్రవహింపఁజొచ్చె. అది మొదలుకొని నేఁటివఱకును చంపాపురీ కుమారికలు నీరు ముంచుకొనునప్పు డెల్ల తన ప్రజలకై తన ప్రాణము నర్పించిన యా రాణిని వేయినోళ్ల కొనియాడుచుందురు. ”

ఆంగ్లేయ బాలిక కోపోద్రేక ముట్టిపడ మాటి త్రిప్పుకొనెను. ఆ చిన్నదాని కన్ను లశ్రుపూరితంబులై మాంద్యంబు వహించె.

“అయ్యో! అమ్మా! దీనిని నేను విని సహింపఁజాలను. ఇది మహా క్రూరమైన కథ! ఏలాగు వారామె నట్లు చేయ నిచ్చిరి?”

తల్లి గడగడ వణఁకుచున్న యీ చిన్నదానిని దగ్గఱ తీసి కొని “అమ్మాయీ! వారామె నట్లు చేయ మన లేదు” అని యోదార్చెను.

“నాకు తెలియును. ఓహో! గౌరవాస్పదయగు రాణి యెంత ధైర్యవంతురాలు! తనకీ విషయము తెలిసినప్పు డామె కొడు కెంత యేడ్చియుండునో! అందఱు నామె నెంత ప్రేమించియుందురు! నే నామెను మనఃపూర్వకముగా ప్రేమిం చెదను. ఔనుగాని, అమ్మా! జరగినకార్యము మంచిదని చెప్పకుము. దేవుని హృదయము.—”

“దేవుని కోమల హృదయ మాయన బిడ్డలయొక్క హృదయముకంటె నెక్కుడు దయా దాక్షిణ్యములు గల దని వా రెఱింగి యుందు రేని, ఆయన యిట్టి ఘోరమైన బలిని కోరునని వారు స్వప్నమందైనను తలఁచి యుండరు. ఐనను, అమ్మాయీ! ఈ కథయంతయు తమోమయంబు కాదు. ఈ దారుణ దోష తమంబునుండియే యితర జీవు లపై ధారాళముగా చూపఁబడిన ప్రేమ నిర్మలంబుగా ప్రకా శించుచున్నది. తమోవృత్తియు క్రౌర్యంబును గలిసి పోవును; ప్రేమయు నాత్మార్థపరిత్యాగంబును నిలిచియుండును.

ఈ కథ చెప్పఁబడు చోటులం దెల్ల ప్రపంచక ముండునంత కాలమును, పతియందలి ప్రేమచే నాత్మపరిత్యాగంబు చేసిన యీ రాణి ప్రీతిపూర్వకముగా గౌరవింపఁబడును."

---

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

నేనొక రమ్యమైన సంగతిని చెప్పబోవుచున్నాను. అదేమనగా ఫిబ్రవరి 11 వ తేది మంగళవారము ఉదయము 8 గంటల రైలునకు 31 మందిమి కొండవీడుకొండలను దర్శిం

చుటకు బయలుదేరితిమి. మేము 8 గంటలకు రైలునెక్కి సుమారు 10 గంటలకు పిరంగిపురము స్టేషన్‌లో దిగితిమి. అచ్చట మా సామానునంతటిని దింపి కూలీలుకొరకును బండ్ల కొరకును వెతకితిమిగాని దొరకవయ్యె. ఇట్లు కొంతసేపు అచ్చటనుండగా దైవసహాయముచే నొక బ్రాహ్మణపిల్లవాడు మాయొద్దకువచ్చి మీరెచ్చటికి వెళ్లెదరని యడిగెను. అందుకు మేము కొండవీటికొండలకు వెళ్లుచున్నామని చెప్పితిమి అప్పుడు మేము ఆ పిల్లవానితో దయచేసి నీవు యూరిలోనికి వెళ్లి మాకొరకొకబండిని మాటలాడి తీసికొనిరమ్మని చెప్పితిమి ఆయితే ఆ పిల్లవాడు బండ్లు ఇచ్చట దొరకుట కష్టమని చెప్పెను. అప్పుడు మేము సామానును మేమే మోసికొని చాల ఇడుములుపడుచు చివరకు పిరంగిపురపు గ్రామములోనికి వెళ్లితిమి. ఆ యూరివారందరు గుంపుకూడి మాయొద్దకువచ్చిరి. అచ్చటివారు «మీ రెచ్చటికి వెళ్లెదరని మమ్ములనడిగిరి.» అందుకు మేము «కొండవీడు కొండలకని» చెప్పితిమి. అప్పుడు వారు ఇంత ఎండలో ఎట్లు వెళ్లెదరని అడిగిరి. అందుకు మేము ఎట్లయినను వెళ్లవలెనని చెప్పి అచ్చట నొకబండిని కుదుర్చుకొని మా సామానునంతటిని బండిపైవైచి బండి ఒక మార్గమునను మేమొక మార్గమునను వెళ్లుటకు బయలుదేరితిమి. మేము వెళ్లుమార్గమునందు పచ్చనైన కన్నులపండువజేయు ప్రత్తిచేలను, కొన్ని మిరపతోటలను చూచుచు సంతో

షముగా పోవుచుండగా కొంత దూరమందు కొందరు మనుష్యులు ఉల్లితోటలకు మోటసహాయముచే నీళ్లు పెట్టుచుండిరి. మేము ఆ చోటికివెళ్లి అచ్చట కొంతసేపు నిలుచుండి నీళ్లు త్రాగి వెళ్లుటకు బయలుదేరితిమి. పిమ్మట మార్గమందు ప్రతి చేలలో ప్రత్తితీయు మనుష్యులనుచూచుచు వారితో మాటలాడుచు కొండపీడు గ్రామము చేరితిమి. అక్కడకు చేరునంతలో చాలా అలసట చెందియుంటిమి. మేము వెళ్లి చెట్టుక్రింద కూర్చొనియుండగా గ్రామాధికారి మాయొద్దకు రాగా మా దొరసాని మా వృత్తాంతమంతయు వినిపించెను. అప్పుడు, «మీరు ఇన్నిగంటలకు కొండ ఎక్కుదురా»యని చాలా యాశ్చర్యపడిరి. పిమ్మట వాచరునకు కబురుచేసెను. వెంటనే వాచరు మా దగ్గరకువచ్చి కొండకు పోవుటకుముందు నడచెను. మేము వెళ్లులోపల మాసామానుబండివచ్చి కొండ సమీపమునసుండు ఒక గ్రామముయొద్ద నిలచెను. అచ్చట సామానుదింపి కూలీలకొరకు చాల కష్టపడి చివరకు కూలీలను కుదుర్చుకొని సామాను వారికిచ్చి కొండ ఎక్కుటకు ఆరంభించితిమి మేము ఒక గంటకు కొండ ఎక్కుటకు ఆరంభించితిమి. కొండ ఎక్కుచుండగా కాళ్లుకాల నెత్తిమాడ, నోరెండ, ఇట్టిబాధలు పడుచు మధ్యమధ్య అలసట తీర్చుకొనుచు సమీపములోనున్న పుష్పములుచూచి సంతోషించుచు, యాత్రికుని ప్రయాణము తలంచుచు ఇశ్రాయేలీయులవలె గొణుగుచు ఎప్పుడు బంగళా

కనుపడునాయని కన్నులు లొట్టలుపడునట్లుగా ముందువైపు చూచుచు నడచితిమి. చిట్టచివర బంగళాయొక్క పైభాగము కనుపించగా హృదయానందమునకు ఆరంభమాయెను. మరి కొన్ని యడుగులు నడచి బంగళాలోపలికి వెళ్లి దానిలోని వస్తు సముదాయమునుచూచి సంతసించితిమి. దీనితో ఎండబాధ తీరెనుగాని దాహబాధ తీఱలేదు. ఇంక కొన్ని నిమిషములు ఆ కష్టముతోనే నీటిని సంపాదించుకొంటిమి. మరియొక సంతోషకరమైన సంగతి. అదేదనగా, ఆ నీరున్నస్థలము చిత్రమైన ఇల్లువలె కనుపించెను. అందుండునీరు బహుచల్లగా నుండెను. ఆ బావిని చూచినవారికే దానియొక్క అందము సంతోషము తెలియునుగాని చూడనివారికి దానిని వివరింప నలవికాదు. పిమ్మట మేము తీసికొనివెళ్లిన పులిహోరను భుజించితిమి. పిమ్మట కొన్నిగంటలసేపు అలసట తీర్చుకొని సాయంకాలము $4\frac{1}{2}$ గంటలకు ఆ మంచియూవిని అందుండు చిత్రములను చూచుటకు బయలుదేరితిమి. అక్కడున్న కొత్తు లుండు భావని రెడ్డికట్టించిన పాతదుర్గములను కొన్ని లోయ లును చూచి ఏడుకొండలమాను అనబడు కొండలెక్కి నలు దిక్కులుండు స్థలములనుచూచి అచ్చటనుండు పూలను పరీ క్షించి, ఈ రీతిగ ఆ ప్రదేశములంతట తిరిగి సుమారు $7\frac{1}{2}$ గంటలకు మా యథాస్థానము చేరితిమి. మేము ఇంటికి

వచ్చులోపల భోజనము సిద్ధముగా యుండెను. 8 గంటలకు అందరము భుజించి 9 గంటలకు పరుండితిమి.

తిరిగి 3 గంటలకులేచి మా సామానులన్నియు సర్ది 3½ గంటలకు కొండదిగ ప్రారంభించితిమి. దిగునపుడు చాలా చీకటిగా యుండుటచే మాకున్న భీతి చెప్ప వీలుకాదు. ఇది ఇట్లుండగా మాలో కొందరు పడుచుండగా నక్కలు భయములు కలిగెను. ఇద్దరు ముగ్గురు సహోదరీలకు మంచి దెబ్బలు తగిలెను. ఈ విధముగ ఇడుమలుపడుచు అందరము మా సామానులతోటి 5½ గంటలకు కొండదిగితిమి 5½ గంటలనుండి రైలుకు నడుచుటకు ఆరంభించి చేలలన్నియు చూచుచు సుమారు 7 కొట్టకముందు అందరము పిరంగిపురము స్టేషను చేరితిమి. దీని సమీపములో ఒక చెరువుండగ అక్కడ ముఖములుకడిగి బండికొఱకు నిరీక్షించుచుంటిమి. ఇంతలో బండి వచ్చెను. మేమందరము బండిఎక్కి సుమారు 8½ గంటలకు గుంటూరుస్టేషనులో దిగితిమి. అక్కడనుండి సామానుకొరకు బండితీసికొని ఇల్లు చేరితిమి. ఆ యుదయము మాకు అలసట నిమిత్తము సెలవు ఇవ్వబడెను. అందరము అలసట తీర్చుకొని సాయంకాలము బడికి వెళ్లితిమి.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రురాలు

C. L. S. PRESS, MADRAS—1919